# వాస్తవ శాస్త్ర దర్శనము



## ప్రారంభ సంచిక

- పల్యావరుఖల శ్రీరామకృష్ణ శర్మ



@VastavaSastraDarsanam Page

Like us to Follow

ఓమ్ శ్రీగణేశాయ నమ:

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# వాస్తవ శాస్త్రదర్శనము

వాస్తు-జ్యోతిషము-ధర్మశాస్త్రము e- magazine

అందరకూ సహృదయనమస్సులు....

**ఈ నెల 15 వ తేదీ నుండి "వాస్తవశాస్త్రదర్శనము" ద్వారా ఫేస్‌బుక్ (Face Book) కరపత్రిక ప్రారంభము చేయుచున్నాను.**

**వాస్తు -జ్యోతిషము - ధర్మశాస్త్రమునకు సంబంధించిన యదార్థమైన, ఋషిప్రోక్తమైన ఆధారముల ద్వారా వ్యాసములతో కూడిన కరపత్రము(పత్రిక) ద్వారా అందరకూ తెలియచేయాలనే ఉద్దేశ్యముతో చేయుచున్న చిన్నప్రయత్నము.**

1. ఇందులో అందరకూ అవకాశముకలదు.
2. పైన తెలిపిన 3 శాస్త్రముల యందు ప్రావీణ్యముకలవారు మీమీ వ్యాసములు పంపవచ్చును.
3. మీరుపంపే వ్యాసములు ఋషులు తెలిపిన విషయాలు అయియుండాలి.
4. స్తుతి – సుత్తిలేకుండా బల్ల గుద్దినట్టు వ్యాసములు ఉండాలి.(అవసరాన్నిబట్టి సవాల్ కూడా చేయవచ్చును.)
5. సుమారు 8 పేజీలుగా ఎ 4 పేపర్లు ఉండే విధముగా ప్రిపేర్ చేస్తున్నాము.
6. వ్యాసములు 2 పేజీలు మించరాదు.( ఒకవేళ పెరిగితే వచ్చే సంచికలో సశేషం వేయబడుతుంది.)
7. వ్యాసములు పంపేవారు అనుస్క్రిప్ట్ 7 వెర్షన్‌లో టైపు చేసి vvvk711@gmail.com పంపాలి.
8. మా సభ్యులు నిర్ణయించిన ఉత్తమవ్యాసానికి తగిన బహుమతి అందచేయబడును.
9. తుదినిర్ణయము మాకు మాత్రమే ఉంటుంది.
10. వ్యాసములపై ఉత్తర ప్రత్యుత్తరములకు తావుండదు.
11. వ్యాసములు పంపేవారు పూర్తి చిరునామా,సెల్,మెయిల్ తో పూర్తి వివరములు పంపగలరు.
12. ఇంకనూ చేర్పులు,మార్పులు చేయుఅధికారములు మాకుమాత్రమే ఉంటాయి.

గమనిక: ప్రతీ శనివారము ఉదయం 6.00 లకు మీ ముందుకువస్తుంది.

వివరాలకు: వాస్తు విద్యా విజ్ఞాన కేంద్రము, తాడేపల్లిగూడెం. 9849252017 కు సంప్రదించవచ్చును.

సంపాదకీయం ।

అందరకూ సహృదయనమస్సులు....

వాస్తవశాస్త్రదర్శనము అను ఈ ఇ- పత్రిక ప్రారంభించుటకు భగవత్సంకల్పముగా భావిస్తున్నాను. నాకు 40 సంవత్స రాలు పూర్తయి 41 లోనికి అడుగుపెట్టాను. ఇప్పటి వరకు నా జీవితంలో జరిగిన అనేక సంఘటనలు, ఘటనలు, ప్రతిఘట నలు ఒకటేమిటి మనిషి జీవితంలో ఏది జరిగితే ఓర్చుకోగలడో, ఏది జరిగితే ఓర్చుకోలేడో అవి అన్నీ నాజీవితంలో జరిగాయి.

నా జీవితంలో జరిగిన ప్రతి సంఘటన నన్ను ఒక మెట్టు పైనే కూర్చోబెట్టింది గానీ, దిగజారిపోనీయలేదు. ఒక్కో ఘటన వెనుక ఒక్కో మైలురాయిని దాటుతూ ధీటుగా ఎదుర్కొంటూ వచ్చాను. ఎవరు ఎంతకు తెగించినా ప్రతిఘటిస్తూ, ఆఖరుకు మరణాన్ని కూడా దాటుకుంటూ వచ్చాను. ఇంత జరుగుతున్నా ఏనాడు నేను ఆచరించే ధర్మాన్ని, న్యాయాన్ని, సత్యాన్ని వదల్లేదు. నేను తినడానికి లేనప్పుడు కూడా తప్పుడుమార్గాన్ని ఎంచుకోలేదు. అదే నన్ను అందరి ముందు తలెత్తుకునేలా నిలబెట్టింది. ఇదంతా భగవత్సంకల్పం కాక మరేమిటి.

నాది పురోహిత వృత్తి, జ్యోతిషం వాస్తు ప్రవృత్తి, పంచాంగంవ్యాపకం. ధార్మికం నా ధర్మం. ఇదే నేనుపాటించే సూత్రములు. ఏ వృత్తిలోనైనా నేను చెప్పేది ఒక్కటే అదే సత్యము. రాజకీయ నాయకుల నుండి పత్రికా సంపాదకులవరకూ, టీవీ వాళ్ల నుండి ఫేస్‌బుక్ వీరుల వరకూ, పండితుల నుండి పురోహితుల వరకూ ఇలా అందరితో గొడవపడినవాడినే. కానీ ఒకటి నిజం ఎవరితో గొడవపడినా చాటుకుండా కాదురా ఎదురుగా పోరాడుకుందాం అంటే అందరూ పారిపోయేవారే గానీ, నిలపడినవాడు ఒక్కడూ లేడు. ఆఖరుకు నాస్తిక,హేతువాద లాంటి వారితో కూడా పోరాడినవాడినే. ఐతే ఎప్పుడూ వెనుకడుగేయలేదు. ఇదంతా నా గొప్పదనము కాదు, నను కన్న అమ్మనాన్నది, మరియు నేను నేర్చుకున్న సత్యానిది. అదే నన్ను నడిపించే దైవము అయినది.

ఇలా నా ప్రయాణములో ఎన్నో మార్పులు, చేర్పులు. ఇదంతా ఎందుకు మీతో చెప్తున్నానంటే, ఎందుకోసము ఈ ఇ - పత్రిక పెట్టానో మీకు తెలియాల్సిన అవసరం ఉన్నది కనుక. అలా తెలిస్తేనే ఉన్న విషయాన్ని మీ ముందుంచినప్పుడు మీకు అర్థమవుతుంది, లేక పోతే అర్థముకాదు.

ప్రస్తుతము ఏ టీవీలు చూసినా, ఏ పేపరు, ఏ పత్రిక చూసినా అందులో సత్యమెంత, అసత్యమెంత అనేది మనకు తెలుసుకోవడం కష్టం. ఎక్కడ చూసినా అసత్య సిద్ధాంతాలే కానీ నిజమైన సిద్ధాంతాలు ఒక్కటీ కానరావట్లేదు. ప్రధానంగా మనిషి మనుగడకు, మంచి చెడులకు ఆధారమైన వాస్తు, జ్యోతిష, తదితర విషయాలలో ఎక్కడ చూసినా అవినీతి, అసత్యమయము. ముఖ్యంగా టీవీల వల్ల మన శాస్త్రములు పాడయిపోయాయి. దానిని బ్రతికించే నాథుల్లు కనపడడంలేదు. పోనీ మాలాంటివాళ్లము కృషి చేస్తున్నా అవకాశము ఇచ్చేనాథుడు ఒక్కడూలేడు. పోనీ మనమే ఒక ఛానల్ పెడదామా అంటే తగిన ధన వనరులు లేవు. ఒకవేళ పుస్తకాలు వేసి పంచుదామన్నా ధనప్రవాహంలో కొట్టుకుపోవాల్సిందేకానీ ప్రయోజనమ్ లేదు.

అందుకే నా ఫేస్‌బుక్ ను ఆధారముగా చేసుకుని, క్రొత్త పేజీని తయారు చేసి మీ అందరకూ వాస్తు, జ్యోతిష, ధర్మశాస్త్రములలోని విషయాలను ఏది సత్యమో, ఏది అసత్యమో, ఏది మంచిదో ఏది మంచిదికాదో ఖచ్చితముగా తెలియచేయాలనే తలంపుతో మీ ముందుకు వచ్చినదే మన " వాస్తవ శాస్త్ర దర్శనము" .

వాస్తవాన్ని వాస్తవంగా తెలుసుకోవాలి అదే శాస్త్రము, అట్టి శాస్త్రమును మీకు కళ్లకు కట్టినట్టు చూపించడమే దర్శనమ్. అందుకే ఈ ఇ -పత్రిక కు " వాస్తవ శాస్త్ర దర్శనము" పేరు పెట్టడము జరిగినది.

గత వారం పేరు కోసం నా psrkrishna facebook లో కొందరు కొన్ని పేర్లు సూచించారు. కానీ నాకు ఏవీ రుచించలేదు. ఐతే మా facebook మిత్రులు సూచించిన కొన్నిటిని క్రోడీకరించి, మిళితం చేసి ఈ పేరును పెట్టడం జరిగినది. చాలామంది facebook లను, పనికిరాని వాటికి ఉపయోగిస్తు న్నారు కానీ, ప్రజలను విద్యావంతులను, ఆలోచనా పరులను చేయడానికి ఉపయోగపడడం లేదు.

facebook లో ఎవరు ఎవరూ తెలియదు. కానీ మనం అందరం ఒకే కుటుంబం. నేటి నుండి ప్రారంభమైన ప్రయాణం మన కందరకూ శాస్త్ర జ్యోతిని వాస్తవంగా దర్శించాలని కోరుతున్నాను. నాయీ ప్రయత్నములో ఎప్పటికప్పుడు మంచి సూచనలతో ముందుకు తీసుకు వెళుతున్న మా మిత్రులు, ఎందరో పండితులను వెలుగులోకి తీసుకువచ్చిన మోహన్‌పబ్లికేషన్ అధినేత శ్రీఆకుల రామచంద్రరావు గారికి భగవంతుడు ఆయురారోగ్యాలు, లక్ష్మీ అనుగ్రహాన్ని కలిగించాలని కోరుతున్నాను.

అలానే నేను చేసే ప్రతీ కృషిలో వెన్నంటి సహకరించే నా శ్రీమతి వేంకటసత్యలలితాఫణిలక్ష్మి, నా కుమారుడు చి॥ షణ్ముఖ కపీశ్వర లకు మీ అందరి ఆశీస్సులు ఉండాలని కోరుతూ

మీ

పళ్లావఝుల శ్రీరామకృష్ణ శర్మ

వాస్తు విద్యా విజ్ఞాన కేంద్రము

# ఆదిత్య హృదయము

**సకలకార్యజయములకు,**
**సంపూర్ణ ఆరోగ్యప్రాప్తికి పఠించవలసిన**
**దివ్యస్తోత్రము.**

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః।**
**గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః॥**

తతో యుద్ధపరిశ్రాంతం సమరే చిన్తయాస్తితమ్।
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ॥ 1

దేవతైశ్చ సమాగమ్యా ద్రష్టు మభ్యాగతో రణమ్ ।
ఉపాగమ్యా బ్రవీద్రామ మగస్త్యో భగవా నృషిః ॥ 2

రామరామ మహాబాహో శృణుగుహ్యం సనాతనమ్ ।
ఏనసర్వా నరీన్ వత్స సమరే విజయిష్యసి ॥ 3

ఆదిత్యం హృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్ ।
జయావహం జపేన్నిత్యం మక్షయ్యం పరమం శివమ్ ॥ 4

సర్వమంగళ మాంగల్యం సర్వపాప ప్రణాశనమ్ ।
చింతాశోక ప్రశమన మాయువర్ధన ముత్తమమ్ ॥ 5

రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతమ్ ।
పూజయస్య వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్ ॥ 6

సర్వదేవాత్మకో హేకచష తేజస్వీ రశ్మిభావనః ।
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతిగభస్తిభిః ॥ 7

ఏష బ్రహ్మే చ విష్ణుశ్చశివస్స్కందః ప్రజాపతిః ।
మహేంద్రో ధనదః కాలోయమస్సోమో హ్యపాంపతిః ॥ 8

పితరో వసవస్సాధ్యా హ్యశినౌ మరుతో మనుః ।
వాయు ర్వహ్నిః ప్రజాః ప్రాణా బుతుకర్తా ప్రభాకరాః ॥ 9

ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్ ।
సువర్ణసదృశో భానుః స్వర్ణరేతా దివాకరః ॥ 10

హరిదశ్వ స్సహస్రార్చి స్సప్తసప్తిర్మరీ చిమాన్ ।
తిమిరోన్మథన శ్శంభు స్త్వ ష్టామార్తాండ అంశుమాన్ ॥ 11

హిరణ్యగర్భ శ్శిశిర స్తపనో భాస్కరో రవిః ।
అగ్నిగర్భోదితేః పుత్రశ్శంఖ శ్శిశిరనాశనః ॥ 12

వ్యోమనాథస్తమోభేదీ బుగ్యజుస్సామపారగః ।
ఘన వృష్టి రపాంమిత్రో వింధ్య వీథీప్ల వంగమః ॥ 13

ఆతపీమండలీ మృత్యుః పింగళ స్సర్వతాపనః ।
కవి ర్విశ్వోమహాతేజా రక్త స్సర్వభవోద్భవః ॥ 14

నక్ష త్రగ్రహ తారాణా మధిపో విశ్వభావనః ।
తేజసా మపి తేజస్వి ద్వాదశాత్మన్ నమోస్తుతే ॥ 15

నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయేనమః ।
జ్యోతి ర్గణానాం పతయే దినాధిపతయే నమః ॥ 16

జయాయ జయ భద్రాయ హర్యశ్వాయ నమోనమః ।
నమోనమస్సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః ॥ 17

నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః ।
నమః పద్మ ప్రబోధాయ మార్తాండాయ నమో నమః ॥ 18

ఆరోగ్యం భాస్కరాధీనం భాస్కరో మమ దేవతా ।
నిత్యమూ పై శ్లోకము పఠించిన వారికి ఆరోగ్యము సిద్ధించును.



ఆదిత్యహృదయము నిత్యమూ పఠించిన వారికి సకలము జయ మగును. అనుభవ సిద్ధము.

బ్రహ్మేశా నాచ్యుతేశాయ సూర్యాయ దివ్యవర్చసే ।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః ॥ 19

తయోఘ్నాయ హిమఘ్నాయ శత్రేఘ్నాయా మితాత్మనే ।
కృతఘ్ను ఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః ॥ 20

తప్తచా మికరాభాయ వహ్నయే విశ్వకర్మణే ।
నమస్త మోభివిఘ్నాయ రుచయే లోకసాక్షిణే ॥ 21

నాశయత్యేష వైభూతం తదేవ సృజతి ప్రభుః ।
పాయ త్యేష తప త్యేష వర్ష త్యేష గభస్తిభిః ॥ 22

ఏషసుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః ।
ఏష ఏ వాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రినామ్ ॥ 23

వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ ।
యాని కృత్యాని లోకేషు సర్వఏష రవిః ప్రభుః ॥ 24

ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాంతా రేషు భయేషు చ ।
కీర్తియన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ ॥ 25

పూజయ స్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్ ।
ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యషి ॥ 26

అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యషి ।
ఏవముక్త్వా తథా గస్త్యో జగామ చ యథాగతమ్ ॥ 27

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోభవత్తదా ।
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రియతాత్మవాన్ ॥ 28

ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్ష మవాప్తవాన్ ।
త్రాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్ ॥ 29

రావణం ప్రేక్ష్య హృష్టాత్మ యుద్ధాయ సముపాగమత్ ।
సర్వయత్నేన మహతా వధేతస్య ధృతో భవత్ ॥ 30

అథ రవి రవదన్నిరీక్ష్య రామం – ముదితమనాః పరమమ్ ।
ప్రహృష్యమాణః – నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచస్త్వరేతి ॥ 31

శ్రీ సూర్యనారాయణ దేవతార్పణమస్తు

# శివ పూజ ఎప్పుడు చేయాలి ?

పాలపర్తి శ్రీకాంతశర్మ
విజయవాడ

మనుషులు తమ తమ కోరికలు తీరడం కోసం, కష్టం నుండి బయట పడడం కోసం, లాభం కోసం వివిధ దేవతారాధనలు చేస్తారు. ఆయా దేవతల పూజ చేయడానికి శాస్త్రం కొన్ని ప్రత్యేక నియమాలు నిర్దేశించింది. శివుని ఆరాధనకు అంటే కోరికలు తీరడంకోసం చేసే రుద్రాభిషేకాలు, విశేషమైన పూజలు, శివలింగ ప్రతిష్ఠాపన కోసం కొన్ని ప్రత్యేక సమయాలు ఉన్నాయి. ఆ సమయాలను వాటి ఫలితాలను ఇక్కడ తెలియ చేస్తున్నాము. నిత్య శివారాధన చేసే వారికి శాస్త్ర విధిని అనుసరించి, చేసే ఇతర వైదిక కర్మలలో భాగంగా శివార్చన చేసేవారికి ఈ నియమాలు వర్తించవు. అప్పుడప్పుడు చేసే వారికి మాత్రమే ఇవి చేసేకోవాలి.

| క్ర.సం | శుక్లపక్ష తిథులు | కృష్ణపక్ష తిథులు | నివాసం | ఫలం |
|---|---|---|---|---|
| 1 | పాడ్యమి, అష్టమి, పూర్ణిమ | సప్తమి, చతుర్దశి | స్మశానం | మరణం |
| 2 | విదియ, నవమి | పాడ్యమి, అష్టమి, అమావాస్య | గౌరీసమీపం | సుఖం |
| 3 | తదియ దశమి | విదియ, నవమి | సభలో | సంతానం, సామాన్యం |
| 4 | చవితి, ఏకాదశి | తదియ దశమి | క్రీడ | దు:ఖం |
| 5 | పంచమి, ద్వాదశి | చవితి, ఏకాదశి | కైలాసం | శ్రేష్ఠం, సుఖం,లాభం |
| 6 | షష్టి త్రయోదశి | పంచమి, ద్వాదశి | వృషభం | అభీష్టసిద్ది |
| 7 | సప్తమి, చతుర్దశి | షష్టి త్రయోదశి | భోజనం, తపస్సు | పీడ, శుభం |

**ఇది ప్రారంభ సంచిక మాత్రమే**
**18.11.2017 నుండి**
**ప్రతీ శనివారము ఉదయం 6.00 లకు**
**క్రమముగా**
**సంచిక వెలువడును.**
**తగిన సూచనలు అందచేయగలరు.**

